శ్రీ

# పాండురంగశతకము



గ్రంథకర్త

అంబటిపూడి సత్యనారాయణ.

ద్వితీయ సుమము

ఓమ్

శ్రీ

# పాండురంగ శతకము



గ్రంథకర్త

అంబటిపూడి సత్యనారాయణ

ఓమ్

శ్రీ

# పాండురంగశతకము

శ్రీలోలా! మధుసూదనా! సహృదయా! శ్రీయిందిరాచిత్తచో
రా! లావణ్యమయా! గదాధర! విశాలం బైనక్షోణీస్థలిన్
శ్రీల జ్జూపుచు మౌనిమానసముల న్నదిరించునీజాడ లెం
డాలోకింపఁగఁగానరావు శుభ నేతా! పాండురంగప్రభూ! ౧

నీకారుణ్యసుధాస్రవంతి మునుఁగన్; నీదివ్యనామాతుర
ప్రాకట్యంబు, మహానుభావతలఁ బల్మా ర్నోటఁ గీర్తింపుచున్
వైకుంఠస్థమహావిశేషములనే భావింపఁడే యెవ్వఁ డా
కాకోలాశనుఁ డార్తిసంహరణదక్షా! పాండురంగప్రభూ! ౨

అల వైకుంఠమునందు శ్రీరమణి పాదాబ్జంబు లొత్తంగ, మా
నులు సంగీతముఁ బాడ నిర్జరులు సంతోషంబుతోఁ జామరం
బులు వీవన్ ఫణిరాజు పాన్పుపయి నేపుల్మీరఁ గొల్వుండి ని
స్తులభోగంబులఁ బొల్చునిన్ను మది నుంతున్ పాండురంగ... ౩

అరవిందేక్షణ! భక్తవత్సల! త్రిలోకారాధ్య! సంసారదు
స్తరపాథోనిధిపారదర్శక! మహాత్మా! గానలోలా! చరా
చరసృష్టిస్థితినాశమూల! వరదా! సౌజన్యమూర్తీ! కృపా
భరణా! శ్యామలదేహా! చక్రధర! దేవా! పాంఢురంగ ... ౪

కులుకుంజూపెడిపద్యరత్నముల నీకున్ మాలగా వేయ నే
తొలుదొల్తన్ రచియింపఁబూనితిని సంతోషంబు తళ్కొత్తఁగా
కలమా సాగదు;కోర్కులా చెడెను; సంకల్పంబు మెండయ్యె;త్వ
త్సులభానుగ్రహ మూతగాఁగొని రచింతున్ పాండురంగ ...౫

పదమాధుర్యము గల్గుకొన్నిన్నుడుల నావ్యాసుండు పోతన్నలున్
మొదలౌ దివ్యకవీంద్రబృందములు సొంపుల్మీర నీగాథలన్
సుధ జాల్వార రచించి పూర్ణయశమున్ క్షోణిస్థలిన్ బొందరే;
అది నీప్రేమరసప్రవాహమునఁగాదా ! పాండురంగ ... ౬

చిరకాలంబుననుండి నీగుణములన్ జింతించి, నీనామమే
స్థిరమంచున్ మది నమ్మి, సర్వమును నీసేవావిధానంబుకే
సరియంచర్పణఁజేసి కేల్మోగిచి హర్షంబొందు మహాసింధ్రిలన్
బరిరక్షింపఁగ రమ్ము లెమ్ము గుణధామా ! పాండురంగ.... ౭

మొదలంతంబులు లేనినీచరితము ల్మున్నెందరో సత్కవుల్
మది యుయ్యేలలనూఁగ వ్రాసి రతిరమ్యంబైనపద్యాల, న
ట్టిది నాపొత్తము గానిమాట యది యట్లేకాని, సద్భక్తిసం
పద నేమాత్రము భేదమేర్పడదు దేవా ! పాండురంగ ... ౮

చలినీటన్ మునుగంగలేను; జపముల్ జన్నంబులున్ సల్ప నా
కిల సాధ్యంబులు గావు ; భూతముల సంతృప్తింగనంజాల; నె
ట్టుల నావానిఁగఁ జేసికొందు నిను పాటుంజిక్కనందాఁక నే
వలతు న్నామమహత్త్వసంపదను దేవా ! పాండురంగ ... ౯

అళి పద్మంబునఁగల్గునాసవము నాస్వాదంబుగా నానున
ట్టుల; లేమావిచిగుళ్ళఁ మెక్కొనఁగఁ జెట్టుంజేరు నాశారికల్
బలె, నీనామసుధారసంబు చవిఁజూడన్ మక్కువన్వెచ్చె; నో
జలజాతేక్షణ! శ్రీవికుంఠపురివాసా! పాండురంగ ... ౧౦

లలితంబై, సదసద్వివాదకలనా లక్ష్యంబునై, స్థూలమై
తిలకింపం గనరానిసూక్ష్మమయి, కీర్తింపంగ నుద్వేలమై
తులలేనట్టి ప్రధానరూపమయి, సత్యోపాస్యమై దృశ్యమై
పలుపోకల్నటియించు నీచరిత; దేవా! పాండురంగ ... ౧౧

సిరి నాకేల; విచారభార మగునీశృంగారసంసారసం
కర మేలా, అడియాస లేల, దురితౌఘం బేల, మే నేల, నీ
శ్వర! కాంక్షించెద నీదుపూజలను నాభావంబున న్నిల్చి సు
స్థిరమా మోక్షపథంబుఁ జూపుమిఁక ధాత్రీశ! పాండురంగ...౧౨

హరివో ధాతవో అంబికాపతివో నిర్వ్యాపారివో సాక్షివో
గిరివో వృక్షమవో ఖగేశ్వరుఁడవో గీర్వాణివో లచ్చివో
కరివో మానివో పాండురంగఁడవో; లోకాతీత! యేరీతి నిన్
స్మరియింతున్ సెలవిమ్ము క్షీరనిధివాసా! పాండురంగ. ... ౧౩

ఘనచారిత్ర! మహానుభావ! త్రిజగత్కల్యాణధౌరేయ! కాం
చనచేలా! కరుణావిలాస! హరి! సుజ్ఞానంపుమూర్తీ! నిరం
జన! బృందావనలోల! మానిహృదయాబ్జాంతస్స్థలీఖేల! స
జ్జనభృంగోచ్చరసాల! క్షీరనిధివాసా? పాండురంగ ... ౧౪

కులుకుంజూపెడిపద్యరత్నముల నీకున్ మాలగా వేయ నే
తొలుదొల్తన్ రచియింపఁ బూనితిని సంతోషంబు తళ్కొత్తఁగా
కలమా సాగదు; కోర్కెలా చెడెను; సంకల్పంబు మొండయ్యె; త్వ
త్సులభానుగ్రహ మాతగాఁ గొని రచింతున్ పాండురంగ ...౫

పదమాధుర్యము గల్గుకొన్నుడుల నావ్యాసుండు పోతన్నలున్
మొదలౌ దివ్యకవీంద్రబృందములు సొంపుల్మీర నీగాథలన్
సుధ జాల్వార రచించి పూర్ణయశమున్ క్ష్మాస్థలిన్ బొందరే;
అది నీప్రేమరసప్రవాహమునఁ గాదా! పాండురంగ ... ౬

చిరకాలంబుననుండి నీగుణములన్ జింతించి, నీనామమే
స్థిరమంచున్ మది నమ్మి, సర్వమును నీసేవావిధానంబుకే
సరియం చర్పణఁజేసి కేల్మోగిచి హర్షంబొంద ప్రార్థింతున్
బరిరక్షింపఁగ రమ్ము రమ్ము గుణధామా! పాండురంగ... ౭

మొదలంతంబులు లేని నీచరితము ల్మన్నెందరో సత్కవుల్
మది యుయ్యాలలనూగ వ్రాసి రతిరమ్యంబైన పద్యాల, న
ట్టిది నాపొత్తము గానిమాట యది యట్లేకాని, సద్భక్తిసం
పద నేమాత్రము భేదమేర్పడదు దేవా! పాండురంగ ... ౮

చలినీటన్ మునుగంగలేను; జపముల్ జన్నంబులున్ సల్ప నా
కిల సాధ్యంబులు గావు; భూతముల సంతృప్తిం గనంజాల; నె
ట్టుల నావానిఁగఁ జేసికొందు నిను పాటుంజిక్కనందాఁక నే
వలతు న్నామమహత్త్వసంపదను దేవా! పాండురంగ ... ౯

అళి పద్మంబునఁ గల్గునాసనము నాహ్లాదంబుగా నానున
ట్లాల; లేమావిచిగుళ్ళఁ బైకొనఁగఁ జెట్టుంజేరు నాశారికల్
బలె, నీనామసుధారసంబు చవిఁజూడన్ మక్కువవచ్చె; నో
జలజాతేక్షణ! శ్రీవికుంఠపురివాసా! పాండురంగ ... ౧౦

లలితంబై, సదసద్వివాదకలనా లక్ష్యంబునై, స్థూలమై
తిలకింపం గనరానిసూక్ష్మమయి, కీర్తింపంగ నుద్వేలమై
తులలేనట్టి ప్రధానరూపమయి, సత్యోపాస్యమై దృశ్యమై
పలుపోకల్ నటియించు నీచరిత; దేవా! పాండురంగ ... ౧౧

సిరి నాకేల; విచారభార మగునీశృంగారసంసారసం
కర మేలా, అడియాస లేల, దురితౌఘం బేల, మే నేల, నీ
శ్వర! కాంక్షించెద నీదుపూజలను నాభావంబున న్నిల్చి సు
స్థిరమౌ మోక్షపథంబుఁ జూపుమిఁక ధాత్రీశ! పాండురంగ...౧౨

హరివో ధాతవొ అంబికాపతివొ నిర్వ్యాపారివో సాక్షివో
గిరివో వృక్షమవో ఖగేశ్వరుఁడవో గీర్వాణివో లచ్చివో
కరివో మానివొ పాండురంగఁడవొ; లోకాతీత! యేరీతి నిన్
స్మరియింతున్ సెలవిమ్ము క్షీరనిధివాసా! పాండురంగ. ... ౧౩

ఘనచారిత్ర! మహానుభావ! త్రిజగత్కల్యాణధౌరేయ! కాం
చనచేలా! కరుణావిలాస! హరి! సుజ్ఞానంపుమూర్తీ! నిరం
జన! బృందావనలోల! మానిహృదయాబ్జాంతస్థలీఖేల! స
జ్జనభృంగోచ్చరసాల! క్షీరనిధివాసా? పాండురంగ ... ౧౪

జలజంబందు జనించి, తత్త్వమెఱుఁగన్ సర్వేశుఁడా నిన్ను భ
క్తిలసద్భావముతోడఁ గాంచఁ దపమున్ దీవ్రంబుగా సల్పి జీ
వుల సృష్టించువిధానము న్గనియె దేవుండైనయాధాత; యిం
పలరన్ గొల్చెద నీపదాంబుజము దేవా! పాండురంగ. ... ౧౫

తలపై నొక్కొకపూవు రాల, వ్రజకాంతల్తోడరాఁ గ్రోవిచే
లలితోల్లాసితరాగమాలికల హేలన్మీఱఁగాఁ బాడి, వా
రలకామ్యంబులఁ దీర్పకుండితివె? యారామంబులో నాడు నా
పలుకే ల్పాటియొనర్ప వేదిగతి; దేవా! పాండురంగ ... ౧౬

నీచంద్రైకవిపీలికంబులను నేసిన్ మత్స్యరూపప్రభల్
కూంచాత్పృక గానవచ్చునని యత్యుత్సాహమేపార నీ
వే చెప్పింపవె నాఁడు నుద్ధవునిచే వ్రేపల్లె హర్షింపఁగా
నీచారిత్రము నుగ్గడింపఁ దరమా నే పాండురంగ ... ౧౭

భక్తత్రాణపరాయణా! త్రిజగము ల్పాలించుగంభీర! ఓ
యుక్తాయుక్తవివేకదీపగుణికా! ఓంకారసద్భూషణా!
ముక్తింపాపుహరా! అఘంబులను నిర్మూలించు దేవేశ! నీ
శక్తిం జూపవిదేమి పాల్కడలివాసా! పాండురంగ. ... ౧౮

శ్రీదేవుం డగుచిన్ స్మరింపనని నీచిత్తంబులో నెంచి వీఁ
డా దాసుండని కోపగించితివొ? నిష్ఠ లేమికిన్ గిన్కయో
ఏదో తెల్పుము కాక మేలగునె? నన్నీరీతి వేధింప నీ
పాదాక్రాంతుఁడ దాసదాసుఁడను దేవా! పాండురంగ ...౧౯

నీకై కానలఁ గొండలన్ దిరిగితి న్నిన్జూడఁగా నెంచి యీ
లోకవార్తలు తెల్ల గుర్తిమరితి ముల్లోకంబులం దెందు నీ
యాకారంబును గాంచలేనయితి రమ్మా! సుస్థిరోత్సాహివై
నాకష్టంబులఁ దీర్చి కాచుటకు నన్నా! పాండురంగ. ... ౨౦

అతిదుష్టాత్ముఁ డజామిళుండు వృషలీ వ్యామోహామం దూగి కా
మితము ల్దీరఁగ ఘోరకృత్యముల భూమిం జేసి యంత్యంబునన్
సుతునామంబు స్మరించుమాత్రమున విశ్వోద్ధార వైకుంఠమం
దతనిన్ జేర్చవె నన్భరింప దయరాదా పాండురంగ. ... ౨౧

తుదిలేనట్టి విచారకూపమున నన్ ద్రోయంగ మేలౌనె? సం
పదలోనైనను నీమహత్త్వమును సంభావింతునేగాని దు
ష్పథసీమన్ విహరింపనోప నిజ మోపద్మాత్మ! యింతేలరా
యిది సత్యంబో యబద్ధమో తెలియు మోయీ పాండురంగ ... ౨౨

తనచిత్తంబున నిల్పెనో హనుమ సంతాపంబుతో నీపథం
బున కడ్డైయరికట్టెనో గజము; నిన్ బూజించి చింతించు బో
యను రక్షింపఁగ నేగితో; ధృవుని డాయన్ బోవుచున్నాడవో
నను వీక్షింపఁగరా విదేమికత మన్నా! పాండురంగ ... ౨౩

పరితాపానల మార్చ సాగరము నాపై దూకదేలా? మనో
భరమున్ మాడ్చఁగఁ గారుచిచ్చునకు సద్భావంబు లేదేల? భీ
కరమా కాలమహోరగం బిపుడు నన్గాటాందదేలా? ధరా
భరహారీ! హరియింపు జీవితము దేవా! పాండురంగ... ౨౪

ఈసంతాపదవానలంబు స్థిరమై హృద్వీథిలో నాటి యీ
నాసర్వాంగముల న్దహించెడిని నన్నా! కోసము న్మైచి నీ
దాసుండం బసివాఁడ నీకరుణ చిందం జిల్కి చల్లార్పు మ
య్యా! సర్వేశ్వరమూర్తి! శౌరి! శరణయ్యా! పాండురంగ...

వింటి న్వీనులపండువౌనటుల నీవిఖ్యాతచారిత్రముల్
కంటి న్గన్నులకర్వుదీర చిరప్రఖ్యాతంబులౌ క్షేత్రముల్
సందేహం బిక నేల; శ్రీవ్య మగునిసౌజన్యసంభావనా
నందోద్వేలమున న్భ్రమింతు సురమాన్యా! పాండురంగ... ౨౬

ఎంతో వేడితి మొఱ్ఱవెట్టితిని నే హీనుండనం చెంచితిం
వింతా! యియ్యది యెందఱెంద ఱిటు "సేవేదిక్కు మాపాలమా
చింతల్దీర్పు"మటంచుఁ గుయ్యిడరొ; సచ్చిద్రూప! పాలింపవో
పంతంబేదుకు? తాళ్మిఁజూపు మిఁక దేవా! పాండురంగ ...

మనుటే దుర్భరమయ్యె ఘోరమగు నిమ్మాయాప్రపంచంబులో
ననువౌమార్గము గానరాక భవదీయం బైనశ్రీనామమే
ఘనమౌనౌకగ నేఁదలంచితిని; దుష్కాలంబొ నాపాపమో
అనఘా! నీదయఁజల్క వేమిటికి మేలా! పాండురంగ ... ౨౮

సుకము ల్శాశ్వతమా? ధనంబు స్థిరమా? చుట్టాలు సత్యంబె? పు
త్రకులుం దారయు నిత్యమా? యురయ మిథ్యారూపమౌపృథ్వి క
న్నొకయింతేనియుఁ గానకే జనము పాపౌఘంబు లార్జించు; వి
శ్వాకళామూరితి! వీరి కేదిగతి దేవా! పాండురంగ ... ౨౯

నీతో నాడెడు గోపబాలకులు నిన్నే గొల్చి నీబోధనా
శ్రీశ్రేయంబుల గోపికామానులును; నుదేశికంబుతో మాధవా!
నీతత్వంబును దెల్పుమం చడిగి నిన్వేధించుగోపాంగనల్
నీతోఁగూడుట కేమినోచిరో; మురారీ! పాండురంగ ... 30

తమము న్గాంచి వెలుంగు బాలుకరణిన్ దైన్యంబుతో నొక్కసిం
గము మేకన్ దిలకించి పర్వెడినచందానన్ రమానాథ! నే
నమువార్జించినజ్ఞానసంపదలు దుర్జ్ఞానంబునన్ జిక్కి ధ్వం
సమునొందెన్ గతియేమి క్షీరసధివాసా! పాండురంగ ... 31

జలరాశి స్థలవారిబిందువులు నక్షత్రంబులున్ రేణువుల్
ఫలవృక్షంబులనున్న పత్రములు చేవల్మీర లెక్కింపఁగా
సులభంబైనను గానుగాని సుగుణస్తోముండవౌ నీదులీ
లలు గుర్తింపఁగ నెవ్వఁడోపు శ్రితపాలా! పాండురంగ ...32

హేబృందావనగోపబాల! గిరిధారీ! విశ్వసంరక్షకా!
భూభారాపనయుఁడవైన! వరదా! మోక్షస్వరూపా! మురా
రీ! భేదం బనుమాటఁజూపకుము నీప్రేమాభిలాషుండ, ర
మ్మా! బాలుండను రక్షణార్థ మనుదెమ్మా! పాండురంగ...33

ఏకాంతంబున నుండుమానికిని దుష్కృత్యంబులన్ జేయుఘో
రాకారుం డగువానికిన్ నిసుగుకున్ రాజిల్లువృక్షంబుకున్
నీకారుణ్యము లేక వెల్గుగలదే? నిర్ద్వంద్వచిత్తుండనై
లోకైకాగ్రవిలాస! గాంచెద కృపాంబూ! పాండురంగ ...34

కలుముల్గూర్చు పడంతి యున్నదనియా? కైలాసవాసుండు నీ
కులదైవం బనియా? దురాత్ములను గర్గోట్లవట్టి బ్రహ్మాదివే
ల్పులచే మన్ననలొందినాడననియా? పుణ్యంబు లేదంచునా?
పలుకే బల్కంగరావు నస్సనవు దేవా! పాండురంగ... ౩౧

అటుకుల్బెట్టంగ జీర్ణచేలుండనో! కన్యారత్నమర్పించి యి
ల్లటమున్గోరియొసంగ బాల్కుడలినో లాలింప నందుండనో
ఘటనల్గాంచంగ జండికాపతినో నిష్కాముండనో? వెఱ్ఱియా
రటమేగాని యెవండ బ్రోవ సురవీరా! పాండురంగ ... ౩౨

చిరసౌఖ్యంబుల రోతబుట్టినను నీసేవావిధానంబు కే
పరుగుల్బెట్టెడి సాధుపుంగవులతో భాషించుచున్నన్, సరే
అరవిందేక్షణుడంచు బాడినను దేహం బుండునందాక నీ
యరిషడ్వర్గముబారి కోర్వ దరమౌనా? పాండురంగ ... ౩౩

కలలో గాంచినదృశ్యవస్తువులు మేల్కాంచ గనరానివై
కలసర్వస్వము శూన్యమైనయటు లోకంబంతయు న్మాయలో
మిళితంబై మెఱమెచ్చులన్గొలిపి స్తంభీభావము న్గూర్చ యీ
వల దుఃఖంబుల పాలుసేయు నరు, దేవా! పాండురంగ ... ౩౪

లలితంబైన శిరీషపుష్పముల నుల్లాసంబుతో దెచ్చి మా
లలుగా గుచ్చి మృదూక్తులం దనిపి కల్యాణాత్మకం బైననీ
గళమం దున్నతభక్తి నైచి, వని నీగానామృతం బాసి వే
తలు హారింపరె? పల్కవేల? సురనాథా! పాండురంగ ... ౩౫

తృణము ల్గొన్నిటఁ జేర్చి మత్తకరి బంధింపంగ వీలౌను స
ద్గుణసంపన్నతఁ గూర్చి దుష్టులకు సాధుత్వంబిడన్ వచ్చు నా
ఫణికోర ల్పెకలింపగానగును దివ్యంబౌ మణిన్ గాని ధా
రుణి చిత్తం బరికట్టఁజాలరు గృపాళూ! పాండురంగ... ౪౦

చిగురెత్తున్ సుమి యెండుమ్రాఁకులును కార్చిచ్చైనఁ జల్లారు హీ
నగతిన్ గ్రుమ్మరుచుండు జీవులకు నౌన్నత్యంబు జేకూరు స
ర్వగతుండౌ భవదీయ సత్కరుణయే రవ్వంత జేకూర బొం
దఁగ రాకుండెడిదేమి సంతతవినోదా పాండురంగ ... ౪౧

జగము ల్వేచెడి రాక్షసాధముల నీచక్రియాళిన్ గూల్చి దే
వగణోత్తంసులచేత మన్ననలు కైవారంబులన్ బొందు ని
న్నుఁ గనన్నేరక యైహికంబులకె సంతోషింతురే గాని మా
నుగ నీ దేహ మనిత్యమం చెఱుఁగనౌనో? పాండురంగ... ౪౨

ప్రళయంబందు సమస్తజీవులకు నుత్పాతంబుఁ గల్పించి భూ
తలము న్వారిధిఁ గల్పివైచి వటపత్రంబందు బాలుండవై
యాలలం దూఁగుచు సంతసింతువఁట నిత్యానందివౌ నీకు జీ
వులసృష్టిస్థితినాశము ల్ముదముఁ గొల్పున్ పాండురంగ... ౪3

చరణాగ్రంబులు నేలమోపి పవనున్ సంధించి సాధింత్రు నిర్
వర యోగీశ్వరులైనవారు తృటిలో బ్రహ్మాండనిర్మాత! నా
తరమా? నిన్నుఁ బ్రసన్నుఁ జేయుటలు వేదాధార యొల్లని నీ
స్మరణోద్యజ్ఝరిఁ గ్రుంకులాడుదు రమేశా! పాండురంగ ... ౪౪

అలుకంబూనితో? యాప్తబంధువుల కాహ్లాదంబుఁగూర్పంగ రం
జిలుపూఁదోటల కేగితో? ఖలతతిన్ శిక్షింపఁ జక్రింబునన్,
జిలుగుం బూతలు బెట్టుచుంటివో? నీ చిత్తంపుఁగాఠిన్యమో?
జలజాక్షా! గమనింపవేమి? జగదీశా! పాండురంగ ... ౪౫

ఘననీదివ్యపదారవిందములు నా కన్నన్నలం పుంచి సా
ధనసంపత్తిని నీదునామములనే ధ్యానించుటేగాని పా
వనమూర్తీ! యితరంబు లే నెఱుఁగ నీపాదంబులే యాన న
న్ననుమానింపకు ద్రోహి యంచనుచు దేవా! పాండురంగ ... ౪౬

శ్రీభామామణి యంకభాగమున నాసీనుండవైయుండి చిం
తాభారంబున నిన్నుఁగూర్చి యొకసేపండంబు గ్రాహింపఁ దూ
ష్ణీభావంబున నూరకుండితివె? ని న్సేవించుభక్తాళి చిం
తాభారంబు హరింపమానితివె నేతా! పాండురంగ ... ౪౭

స్థిరసంతుష్టుఁడ వైననీదుదరికిన్ జేరంగ నూహించి యే
మర కేవేళను నీదునామముల నిమ్మంబార ధ్యానించునన్
వెలిపింపంగఁ బ్రియత్నములన్నలుపునా నీచాతుర్యం జూడు మా
ర్గురు వా రండఁ నెట్లుదోలెదవో? కృపా నిధీ పాండురంగ ... ౪౮

తొలి నేఁజేసినపాపకర్మములు వ్యర్థంజేసి చిత్తంబు నా
కులమొందించుచు గాసివెట్టెడిని; నా గోడు న్విచారింపరా!
బలితంబైనసమస్తతాపహరణ వ్యాపారదక్షుండవై
జలజాక్షా! నిను నమ్మినాఁడ శ్రితపోషా పాండురంగ ... ౪౯

దనుజుల్ మత్తత వేదబాహ్యులగుచున్ దర్పంబు మిన్ముట్ట చే
సినఘోరంబుల కాగలేక యమరుల్ శ్రీనాథ ! నిన్వేడ వా
రినిం గూల్పంగ దశావతారముల నుర్వీభారముం బాపు నీ
ఘనత ల్తగ్గునె నన్ను బ్రోచిన చికాకా ? పాండురంగ ... ౧౦

అకలంకాత్ముండవు సాధురక్షకుండవు సత్యాదీక్షుం డబ్జాక్షుం డీ
సకలప్రాణివిధాత, నేత, రుచిరస్ఫారాంగుం డాద్యుండు నా
వికలత్వంబును బారద్రోలునని నే విన్నాండ భక్తాళిచే
సకటా ! నన్నిక నేమిజేసెదవో ? దేవా ! పాండురంగ ... ౧౧

ఏనా డుద్భవమయ్యెనో జగము, లేయిచ్ఛన్ బ్రసాదించితో
జ్ఞానాజ్ఞానవిమర్శనాదికము; లజ్ఞానాంబుధిం దాటఁగా
లేనే లేదో యుపాయ మున్నయదో? పాలింపంగ నాశక్తి మొ
త్తానన్ నీకడ లేదో? ఉన్నయదో? తాతా ! పాండురంగ ...

మనుజుల్ కష్టములొందు వేళల ననిర్మాలిన్యమౌ భక్తితో
నినుం బూజింత్రు ప్రసూనరాజములచే నీగీతము ల్పాడుచు
ధ్యానసాంపానటు, లెన్నిఁజేసినను శౌరీ! కర్మసూత్రాదిబం
ధము ల్మాయంగ శక్యమౌనె యెటులైనన్ పాండురంగ ... ౧౩

పరమేశుం డెటనుండె? నేపనుల నభ్యస్తంబుఁ గావించు, నీ
పరసృష్టిస్థితులేల జేయు ననునీప్రశ్నార్థమున్ జెప్ప నె
వ్వరికిన్ శక్యము ? కన్నవారెవరు దేవా ! నీప్రభావం బగో
చర మజ్ఞేయ మనంతమయ్య జలజాక్షా ! పాండురంగ ... ౧౪

ఉదకంబందు వసించుమత్స్యము పిపాసోద్రేకముం బాయఁగా
నుదకంబున్ మదిగోరుచందమున శ్రీయోషాపతీ! తారు నీ
హృదయంబందు వసించియున్ దెలియ రెన్నే దేశదేశాలఁ ది
ర్గుదు రత్యంతము నిన్నుఁ జూడగఁ గృపాళూ! పాండురంగ ... ౫౫

ఆరాత్రించరు హేమకశ్యపుని సంహారంబుఁ గావింపఁగా
వీరాగ్రేసరమూర్తియై నృహరివై పీడంపవే నాడు; భూ
భారంబంత హరింప దాల్చితివి రూపా లెన్నొ? సర్వేశ! ని
న్నేరూపంబని నిర్ణయించెదను స్వామీ! పాండురంగ ... ౫౬

లలితంబౌ మురళీరవంబులను దేలంజేసి తానాఁడు మా
నుల, భూజంబుల, గోపబాలకుల, పాంథుల్గోవులన్ వారలా
ఫలమొందన్ గలకర్మనేమి యొనరింపం గాంచిరో? ఒక్కమా
ఱ్బలికింపంగదె నీసుధామురళి ధీరా! పాండురంగ ... ౫౭

చోరత్వంబున వేదముల్గొనిననీచుం ద్రుంచువీరుండవా?
పేరాసన్ మురళీరవంబులను దృప్తిందీర్చు బాలుండవా?
గారాబంబున వ్రేతలంగలయుశృంగారాబ్ధిచంద్రుండవా?
ఏరూపంబున బూజసేసెదను స్వామీ! పాండురంగ ... ౫౮

పసరుం గప్పినకాలమం దసలు నేభావింపఁగాలేదు మా
నస మేత్రోవను బోయెనో యెఱుఁగ స్వప్నంబయ్యె నీపూటనే
మిసిమిఁజిల్కెడునీస్వరూపమును బేర్మిన్ భక్తితోఁ గాంచ నే
నసిధారావ్రతచర్య బూనెదను దేవా! పాండురంగ ... ౫౯

మలినంబైన ప్రపంచనాటకముతో మాకేల ? మాశ్రీధవుం
షలతింజూడఁడు శాస్త్రమం దతఁడు నాహ్లాదంబుగాఁదెల్పె నీ
పలుకుల్ "పత్రమొ పుష్పమో ఫలమొ నన్ భావించియర్పించువా
రలె నాభక్తు"లటంచు క్షీరనిధిలోలా ! పాండురంగ ... ౬౦

ఓయీ ! నాటకసూత్రధారి ! యిపు డెన్నో నాటకప్రక్రియల్
భూయోభూయముగా రచించి యొకదుర్బోధ్యాటవిన్ మమ్ము నీ
వాయాసంపడఁజేయు నేమిఫలమయ్యా ! నీకు ? నీపుస్తకా
ధ్యాయార్థంబు గ్రహింప మాతరమ దేవా ! పాండురంగ...౬౧

కకల్పాంతము కొక్కఁడొక్కఁడట నుద్యోగంబు చేబూని పూ
నిక నీరీతిగ నెందఱెందరినో మన్నీలన్ సుబేదార్ల తా
వక మాయాబలపాటవంబున సృజింపన్ జాలి యీశూన్యనా
టకమాడింతు వనాద్యనంతమగు బాటన్ పాండురంగ... ౬౨

మొదలేదీ? యని గాంచఁబోవునెడలన్ మూతల్పడు న్నేత్రముల్
తుదియా ? యామడలామడ ల్తఱుఁగ కెంతో దూరదూరంబుగా
మదికిన్ జిక్కక పారిపోవు; నిఁక నేమాడెక్కినన్ మన్మనః
పదమందున్ గుడికట్టుకొందు యమదీపా ! పాండురంగ ... ౬౩

నినుఁజింతించుచు నీస్వరూపమును వర్ణింపంగ నుంకించి కా
ననసీమన్ విహరించితిన్ జలధులన్ గన్నార వీక్షించితిన్
ఘనశైలంబుల గాంచితిన్ దుదకు నన్నా! మోసమే గాని కో
రినకామ్యంబులు దీరలేదుగద ! దండ్రీ ! పాండురంగ ... ౬౪

కులగోత్రంబులు వన్నెవాసియును నీకున్ దృప్తిగానంచు భ
క్తులు దానంబుల ధర్మకార్యముల నెంతో నిష్ఠతో సల్పి జ
న్మలసాఫల్యమునొంది తారకలచందానన్ బ్రకాశింతు రీ
యిల నేనట్టులఁ జేయ శక్తుఁడనె శౌరీ! పాండురంగ ... ౬౫

శ్రుతులేమేమి బఠించెఁ గోతి? భుజగేశుం డేవిధుల్ నేర్చె? సం
తత మేధర్మము నిర్వహించెఁ గరి? పుణ్యంబెద్ది గావించె నా
జతపక్షుల్; నినుఁ గొల్చువారలకు నీసామీప్యము న్గూర్చఁగాఁ
బ్రితిన్ బూనియు నన్నుఁ బ్రోవ విది మేలా? పాండురంగ... ౬౬

హిమశైలంబునఁగాని యోగములఁగానీ స్నానసంధ్యాదికా
ల్యముల న్గాని, సమాధుల న్మతియుఁ గైలాసంబున న్గాని, శ్రీ
పమదానాథుఁడు నిల్చినాఁడె; పరికింప న్గల్ల; యాతండు భ
క్తమనోగోళమున న్వసించునఁటగాదా? పాండురంగ ... ౬౭

సుధఁ బోనాడి విసంబు గొన్నటుల భ్రష్టుం జేరి యోగీశులన్
హృదయస్ఫూర్తిగ వీడివైచినటు; రాయింజూచి మాణిక్యమున్
వృథయంచు న్నదిఁ బారవైచుగతి; నీ విశ్వానురాగంబునన్
హృది నీలీలలఁ గాంచనోచనయితిన్ శ్రీపాండురంగ... ౬౮

ఘనుఁ డాపద్మదళాయతాక్షుపదము ల్గాంక్షింప సంరంభివై
మనమా యత్నముసేయవేల? సమయంబా మీరరాదోయియీ
తనువా యెప్పుడొ బుద్బుదంబుగతి నంతర్ధానమున్ జెందు శం
కను బోనాడుమటంచుఁ దెల్పితిని యెగ్గా పాండురంగ ... ౬౯

నిను వీక్షింపక మూఢమానసుఁడనై నీచాత్ముల న్గూడుచో
తనువా బోవు కృతాంతుకింకరులు బాధల్బెట్ట నేతెంతురు; వా
రిని గాంచన్ హృదయంబు బ్రద్దలగు; శౌరీ! కాన నీనామమే
తనివిందీర పఠింతు నెప్డు పరమాత్మా! పాండురంగ ... ౨౦

రవిఁదాకన్ మదిఁగోరుపద్మముగతిన్ రాత్రింబవ ళ్లంబుబిం
దువులన్ గోరెడుఁ జాతకంబు జలదంబుల్ గాచియున్నట్లు; స
త్కవు లుల్లాసముమీఱ సత్కవితనే గాంక్షించు పోల్కిన్ రమా
ధవ! నీదాస్యముఁ గోరుచుండితినిగాదా! పాండురంగ ... ౨౧

అభవా! నీచరణారవిందమకరందాస్వాదనాసక్తుఁడై
శుభము ల్గైకొనె భర్గుఁ డాధ్రువుఁడు పూజ్యుండయ్యె నిర్వీర్యమౌ
యిభరాజోత్తముబాధ మానె; మది సంతృప్తిన్గనెన్ మర్కట
ప్రభుఁడౌ భానునిసూతి; యున్నతప్రతాపా! పాండురంగ ... ౨౨

స్థిరసంకల్పముతోడ నీచరణరాజీవంబులన్ మన్మనః
పరముం జేసితి; సత్యమూర్తివని జంభారాతిముఖ్యుల్నినున్
బరివేష్టించి శుభంబుల న్గనరె నాప్రారబ్ధమానా? నిరా
దరమున్ జూపెద వింక నైన దయరాదా? పాండురంగ ... 23

ధన మీయంగదె ధర్మకార్యముల విస్తారంబుగాఁ జేయు; మీ
రినత్యాగం బిటు లిమ్ము యాచకులయార్తిన్ బాపఁగా నిత్య మీ
శుని ధ్యానింపఁగ నిశ్చలత్వమును సుశ్లోకా! ప్రసాదింపుమా
ఘనకారుణ్యవిలాస! భక్తజనరక్షా! పాండురంగ ... ౨౪

సిరియే సర్వజనానురంజకము విస్తీర్ణప్రపంచంబులో
సిరి లేకుండినఁ గండ్లఁజూడ రకటా! శ్రీదేవినే భార్యఁగా
నరవిందాక్ష! వరింపవా? మురువు; నాకా భాగ్యము ల్గూర్పుమా
చరణం బంటి భజింతు; పాల్కడలివాసా! పాండురంగ... ౭౫

ధనమాహాత్మ్య మెఱింగి, పాల్కడలిమధ్యం జేరి పద్మాలయా
వనిత న్నీవు గ్రహించి భర్గునకు వహ్వా! కాలకూటం బొసం
గినకృష్ణా! నను మోసగింపకుము లక్ష్మిన్ వేగ నాకిమ్ము; కో
రినవానిన్ దయసేయుటే పనిగదా! శ్రీపాండురంగ ... ౭౬

కనకం బుండిన స్వర్గరాజ్యపదమున్ గల్పింపఁగావచ్చు; నీ
కనువౌ సేవ లొనర్పఁగానగును; బ్రహ్మానందమౌనట్లు భో
జనదానం బొనరింపనౌ నొసగు మీశా! లక్ష్మినిన్; జీర్ణచే
లున కెట్లిచ్చితి వంతసంపద కృపాళూ! పాండురంగ ... ౭౭

జనకుం డెప్పుడు పుత్రుకోర్కెల మహోత్సాహంబుతోఁ దీర్చుచున్
తనచిత్తంబున హర్షమొందుటవి యంతన్నైజమయ్యా! జగ
జ్జనకా! వేడెడిదేమి? నీ వెఱుఁగవే జాగేల? దీవ్యత్కృపాం
జనము ల్గన్నుల దిద్దుకొమ్మసురశిక్షా! పాండురంగ ... ౭౮

సమరం బాసురకృత్యమాట భవనాశా! కృష్ణ! నాబంధువ
ర్గములన్ జంపి తదీయరక్తనివహోక్తం బైనయీభూమిపిం
డము నాకేటికి? యన్నయజ్జునికిన్ టాటోటు మాట ల్వచిం
చి మురారీ! భువిబాధ మాన్పితివి వాసిన్ పాండురంగ ... ౭౯

నిను శాక్తేయులు దేవియండ్రు; శివుఁడే నీవండ్రు శైవుల్; పరే
శునిగా నెంతురు యోగిపుంగవులు; విష్ణుఁ జేసినా ర్వైష్ణవుల్
నిను నల్లాయనియండ్రు మ్లేచ్ఛు లిఁక లేనే లేఁడు దేవుం డటం
చని వాక్రుత్తురు బౌద్ధు లిం దెవఁడవయ్యా! పాండురంగ...౭౦

జలదంబు ల్గుమిగూడియుండుతరి జంఝామారుతం బొక్కఁ డా
వలికిఁ వానిని బారఁద్రోలినటు భవ్యప్రౌఢదివ్యాశుగా
వలి నజ్ఞానపటంబుఁ జీల్చుము; భవద్వాత్సల్యముంజూప ని
ర్మలకాలం బిది శ్రీవికుంఠపురిధామా! పాండురంగ ... ౭౧

తెలుఁగుం బాసకు వన్నెఁ బెట్టినమహాధీమంతులా తిక్కనా
దులు నిద్రించిరి కాలగర్భమున, వాతూలంబులో దివ్వె లీ
యిలయం దుండెడి స్థూలకాయములటం చెంతో విచారించి వా
రలు విజ్ఞానమునొంది నిన్గలిసిపోరా? పాండురంగ... ౭౨

నను నీభూమికిఁ బారఁద్రోలి, జనసంఘంబందుఁ గుల్కించి, తీ
రనికష్టంబులపాలుజేసి తుద కౌరా నీపదాంభోజముల్
తనివిందీరని పద్యరత్నముల నారాధింపుమం చాజ్ఞని
చ్చిన నాతండ్రివి నీవుగావె వరదా? శ్రీపాండురంగ ... ౭౩

సంసారార్ణవమందు మున్గుచు దురాశాపాశబద్ధుండనై
హింసల్జేసితి నెక్కు లెట్లువిడునో యీపాపపుంబంధముల్
సంసిద్ధుండను నిన్నుఁ గొల్చుటకు వాత్సల్యంబుఁ జూపించు మో
హంసాకార! పరేశ! క్షీరనిధిధామా! పాండురంగ ...౭౪

సిరి యిల్లాలఁట, పుష్పశయ్యయఁటగా శేషాహి, యావాసమం
దిర మో క్షీరపయోధి; పుష్పశర వాణీశు ల్తనూసంభవుల్

గరుడుండున్ బవనాత్మజుండు భటులై కారుణ్యా మార్గ్గంతు రా
ర్య! రమేశా! భవనాశ! క్షీరనిధివాసా! పాండురంగ...౫౫

శ్రీలోలాక్షివిలాసవీక్షణాలు గర్వింజేసెనా? నారదుం
డాలాపించెడిశ్రావ్యగీతికలు నిన్ హర్షాన్వితుం జేసెనా?
గోలంబుచ్చిరో గోపికాసతులు? నాగో డేలయాలించి నీ
పాలం జేర్పవు? భక్తపాలుఁడవుగావా? పాండురంగ ... ౫౬

ఎటనో పండరిపట్న మున్నదని సాధ్వృటాళలమేఘుంబుకై
గుటక ల్మ్రింగుచకోరకంబుక్రియ సంకోచంబులన్ మాని ప
ర్యటన శ్సేయఁదలంతు నెప్పటికి నాకా భాగ్యముల్గ్గూర్తు, వ
కృట! నీచిత్తము శౌరి! భక్తజనరక్షా! పాండురంగ ...౫౭

జవసత్త్వంబులు జారిపోవునెడ నిష్ఠల్గల్గునా? నాకు నీ
స్తవము ల్సేయఁగ; పుణ్యతీర్థముల చెంతన్ జేర విజ్ఞాన ము
ద్భవమౌనా? ధన మిత్త్రరా సుతులు? కావన్ రమ్ము నేనిప్పుడే
భవబంధమ్ములఁ ద్రెంపివైచెదను దేవా! పాండురంగ ... ౫౮

ఏవిద్వన్ పరిణయింపఁగావలయు నేయేపూలతో నర్చనం
బేవేళన్ నెరవేర్పఁగావలయు నేవృత్తంబులన్ వ్రాసి నా
భావంబందున నిల్పఁగావలయు నే ప్రార్థించుచున్నాఁడరా
నీవృత్తాంత మొకింత దెల్పు మిఁక తండ్రీ! పాండురంగ ... ౫౯

తనచేతస్గలద్రవ్యమంతయును జూదంబంకుఁ గుల్కించి "నా
ధనసర్వస్వము మాసెనం" చతివిషాదంబందుచున్నట్టు లీ
తను వేరోగము బారికోఁ బడఁగ వ్యర్థంబయ్యె నాజీవనం
బనిచింతించిన లాభ మేమి? పరమాత్మా! పాండురంగ... ౬౦

విసమున్ మెక్కినచండికాపతివి నీవేగావె? స్త్రీరూపివ
య్యు సుధన్ బంచిననిందుజవ్వనివి కావో నీవు సత్యంబుకై
యసురుం డాబలి దానమీయఁగనె యాహ్లాదించి పాతాళరా
జ్యసుఖంబు ల్దయసేయు నేతవుగదయ్యా పాండురంగ... ౯౧

తనయానృత్యముఁ జూచి పొంగునొకఁడీదౌర్భాగ్యపుంజీవనం
బనఘా యేమిటికంచు నేడ్చునొకఁ డాహా దేవ! యీలోకమం
దున సౌఖ్యంబులనందువాడెవఁడు? వ్యర్థుల్గారె? నీభక్తులై
నినుఁజింతింపనివాఁడు భావజునితండ్రీ! పాండురంగ... ౯౨

బాలుం డాటలు మాని తల్లికయి యేడ్వం జూచియే యామె యే
పాలో బోసియు కౌగిలిచ్చునటు లీప్రాపంచికప్రక్రియల్
మూలంద్రోచియు మొఱ్ఱవెట్టినఁగదా! మోహోర్మ్యాలం జేయుటల్
నీలీల ల్గ్రహియింపనేర రిల తండ్రీ! పాండురంగ ... ౯౩

అరివీరుల్భయమందఁ గుంభజుఁడు భీష్మాదుల్భ్రమంజెంద, వీ
సరఁజెందన్ కురురాజు, పార్థునకు పజ్జంజేరి సంగ్రామ సా
గర ముఱ్ఱాతల నూపియుండు టది భక్తగ్రామణుల్ నీహితా
దరగీతోక్తులచేఁ దరించుటకుఁగాదా! పాండురంగ ... ౯౪

అరుగో ! జ్ఞానధనంబు దోచికొని, సన్నాశోదధిన్ ముంపఁ జా
ల రసాభాసముఁజేయుచుండు నరిషడ్వర్గంబు; పోకార్పఁగాఁ
గరుణన్ జిల్కుచు రమ్ము రమ్ము జడుఁడన్ గాఠిన్యముంబూన నె
వ్వరినిన్ వేడుదు, చుట్ట మెవ్వ రిక దేవా! పాండురంగ ... ౯౫

అరయన్ జ్ఞాని యెవండు? స్వచ్ఛ మగునీయాకారముంగాంచి నీ
వరము ల్గొన్నఘనుం డెవండు ? జనులో వారిష్టమౌనట్లు వే
సరి వాక్రుత్తురు కొన్ని పేరులను, మాత్సర్యంబుఁ బోనాఁడి నీ
స్మరణన్ జేయక యెట్టివెఱ్ఱులో కా శ్రీశా! పాండురంగ ...౯౬

నవ్వం జేయును వొక్కచోట మఱలన్ బాధింతు వేఱొక్కచో
తవ్వుందవ్వులఁ గానుపించి యొకచోఁ దాల్మిన్ బ్రసాదింపవో
రవ్వం బెట్టుచుఁ గష్టముల్గొలిపి కర్మంబంచుఁ జూపించుని
న్నవ్వం డోపు గ్రహింప, క్షీరనిధిశాయీ ! పాండురంగ ...౯౭

నురుగు ల్గ్రక్కుచుఁ బాఱి శైలముల కన్నుల్గప్పి, ద్రవ్యాశ, సా
గరుపొందు న్నదిఁ గోరువాగులగతిన్, గష్టంబులన్ దూల్చి సు
సిరమౌనీపురమందుఁ దావొసఁగి నాచే సేవలన్ గొందువం
చరవిందేక్షణ ! యెంచుచుండితినిగాదా ! పాండురంగ ...౯౮

పృథివీచక్రము బొంగరంబుగతి నుద్వేలంబుగా వృత్తముల్
చదలున్, సూర్యుడు, చంద్రుడాదిగలనక్షత్రంబులున్ సర్వది
క్పదముల్, సర్వజగత్ప్రజావితతి; వీడొందూరమైపోవఁ ద్రి
ప్పుదు వేలా ? యిది నీవినోదమగు నేమో ? పాండురంగ ...౯౯

శ్రీనాథా! కుటిలాలకంబగుచు గాసిం బెట్టుబంధాల న
న్నా! నన్ దింపకుమోయి; దీనుఁడను సుస్నాతుండనై భక్తిచే
యీనాలేఖిని గూర్చుముత్తెముల నోపృథ్వీశ! నీకంఠ దే
శానన్ హారముగా రచించితిని;శ్రీశా! పాండురంగప్రభూ! ౧౦౦

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.